Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం II.] 1942 వ సం॥ జూ౯ నెల 12 వ తేది శుక్రవారం [నె 23 రు.

## పతాక సమారాధన - రూజువెల్టుగారి ప్రకటన.

ఈ భూలోకంలో అమెరికను జాతి ఒక్కటి మాత్రమే ఏకాకిగా పోరాడుచుండుటలేదు. మన మిత్రమండలి రాజ్యాలవారితో కలిసి ఏకముఖముగా మనము శత్రువు నెదిరించి పోరాడుచున్నాము. మానవ ప్రపంచములో సమాన రోష పౌరుషములతో మనమొక కూటముగా నిలువబడియున్నాము. జయిస్తే అందరము కలిసి ఒక్కమారుగా జయిస్తాము. ఓడిపోతే అందరమూ ఒక్కమారుగానే ఓడిపోతాము.

కనుక మన అమెరికను జాతీయ పతాక గౌరవ దినమున, మన అమెరికను జెండాను మాత్రమేగాక,. ఇతర రాజ్యాల జెండాలనుకూడా మనము గౌరవించవలసియున్నది. ఏ రాజ్యములు శత్రువుల క్రూరనిరంకుశత్వమునకు పాల్పడి కృశించుచున్నవో, ఆ రాజ్యములకు విమోచన కల్పించు నిమిత్తమై యుద్ధము చేయుచున్నామని మనతో కలిసి ప్రమాణ పత్రములపై సంతకములు చేసిన రాజ్యములయొక్క జెండాలను, ఏ రాజ్యములు యుద్ధ సంక్షోభములోపడి అగ్నితప్తముకాకుండా ఉన్నవో, ఏ రాజ్యములు యుద్ధ జ్వాలలను ధైర్య సాహసములతో ఎదిరించి దీర్ఘ కాలము పోరాడుచున్నవో, అట్టి రాజ్యముల పతాకములనుకూడ మనము గౌరవించవలసి యున్నది.

కనుక, 1942 వ సం॥ జూను 14 వ తేదిని మన అమెరికను జాతీయ పతాకమును మనము ఆరాధించెడి దినమున, అమెరికను లందరును, బ్రిటను రాజ్యము, ఉత్తర ఐర్లాండు, రష్యా, చైనా, ఆస్ట్రేలియా, బెల్జియం, కెనడా రాజ్యముల జెండాలను, కోస్టారీగా, క్యూబా, జెకోస్లొవేకియా, డొమినికను రిపబ్లికు, ఎల్‌సాల్వడారు, గ్రీను, గ్వాటిమెలా, హైటీ, హండూరాస్, ఇండియా, లక్సెంబర్గు, నార్వే, పెనామా, పోలెండు, దక్షిణాఫ్రికా యూనియను, యుగోస్లోవియా, రాజ్యముల జెండాలనుకూడా మనము గౌరవించి సన్మానించవలసియున్నదని అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రెసిడెంటునగు ఫ్రాంక్లిను డి. రూజువెల్టునగు నేను యిందుమూలముగా కోరుచున్నాను. మన మిత్ర రాజ్యములన్నింటి యొక్క ఏకైక సమష్టి స్థిర సంకల్పమువల్లనే మానవకోటికి శాంతి స్వాతంత్ర్యములను మనము సాధింపగల్గుదుము.

---

## అక్షరాజ్యాల అంత్యకాలం.

1942 వ సం॥ జూను 14 వ తేదిని అమెరికనులు తమ జాతీయ పతాకమును గౌరవించి ఆరాధిస్తారు. ఆనాడే ఇంగ్లాండులోను, చైనాలోను, ఇండియాలోనుకూడా అమెరికను జెండా ఆరాధింపబడును. ఇటువంటి పతాక సమారాధన యిదివర కెన్నడును ప్రపంచ చరిత్రలో జరిగియుండలేదు. అడవిలో ఉసిరిగాయ, సముద్రంలో ఉప్పు ఏకమైన వన్నట్లుగావుంది. ప్రపంచములోని అనేక రాజ్యములలో వేర్వేరు పరిపాలనా పద్ధతులు అమలులోవున్నవి. కాని, యీ వివిధ ప్రభుత్వతత్వములుగల రాజ్యాలు ఏక వర్గముగా యీ పతాక సమారాధనలో పాల్గొనుచున్నవి. కారణమేమిటి ? ఒక్కటే సంకల్పంతో, ఒక్కటే యుద్ధకార్య తంత్రంతో, ఒక్కటే మనస్సుతో, ఒక సమష్టి శత్రువును జయించుటకు యీ రాజ్యములన్నియు యీ సమారాధనలో ఏకీభవించుచున్నవి. ఇది "అద్భుతము"—ఇట్టిది "నభూతో నభవిష్యతి"—

ఇట్టి పతాక సమారాధన ప్రపంచ చరిత్రలో కని విని యెరుంగము. ఈ మహాసమష్టి సంకల్ప ప్రభావమును వర్ణించుటకు ఆ మాటలుకూడా చాలవు,

ఇంగ్లాండు, పోలండు, గ్రీసు, నార్వే, యుగోస్లోవియా రాజ్యాలు రాజులచేత పరిపాలింపబడుచున్నవి. అమెరికా, రష్యా, చైనా, మెక్సికో రాజ్యాలు ప్రజలచే ఎన్నుకోబడిన ప్రెసిడెంట్లచే పరిపాలింపబడుచున్నవి. జెకోస్లొవేకియా రాజ్యానికి ప్రెసిడెంటుగా పనిచేసియుండిన డాక్టరు బెనిసుగారును, స్వతంత్ర ఫ్రెంచిపక్ష సేనాని యగు గాలీసేనానియున్నూ నేడు చేతులుకలిపి పనిచేయుచున్నారు. దక్షిణాఫ్రికా ప్రధానియగు స్మట్సు సేనానియున్నూ కెనడా ప్రధానియగు మెకంజీ కింగుగారున్ను "భాయి! భాయి!" అనిపని చేయుచున్నారు, ఎక్కడో అమెరికాలో ఉన్న వెనిజులా రాజ్య పతాకమునున్నూ, ఎక్కడో ఐరోపా ఖండంలో మారుమూలముగానుండిన లక్సెంబర్గు రాజ్య పతాకమునున్నూ ఇండియాలో నేడు గౌరవించి సత్కరించవలసిన సందర్భ కారణమేమిటి? ఆ రాజ్యాలతో ఇండియాకు గల సంబంధ బాంధవ్యమేమిటి? అదే మహాద్భుత విశేషము. అనేక రకాల రాళ్లను ఒక్కటే కట్టడముగా బంధించుచున్న సిమెంటు ఎటువంటిదో, యీ వివిధ తత్వాల రాజ్యాలను సంపుటీకరించుచున్న మహాయుద్ధ సంకల్పంకూడా అటువంటిదే.

అధర్మమును నిర్మూలించుటకొరకును ధర్మమును ప్రతిష్ఠించుటకొరకును యుద్ధము చేయుచున్నామనే సమాన స్థిరసంకల్ప మొకటి యీ భిన్నతత్వాల రాజ్యాలన్నింటిని ఒక కూటము లోనికి చేర్చుచున్నది. మానవ స్వాతంత్ర్యము మంచిదా? దాసిసత్వము మంచిదా? స్వాతంత్ర్యమును ప్రతిష్ఠించుటకొరకే మన మిత్రమండలి రాజ్యాలన్నియు పోరాడుచున్నవి. ఈ ధర్మచింత యిన్నిరాజ్యాలను ఒక్క సమారాధనలోనికి సమాకర్షించుచున్నది. అంతేకాదు ఈ రాజ్యములన్నియు అధర్మవర్తనులును, లోకకంటకులును, దురాశాప్రేరితులు నగు శత్రువులను సమష్టిగా సమానంగా ద్వేషించుచున్నవి. ద్వేషమనేది దోషముకాదు. నిరంకుశత్వమును దురహంకార దౌష్ట్యమును ద్వేషించవలెను. ఈ ద్వేషభావము మన మిత్రమండలి రాజ్యముల కన్నింటికిని సమానలక్షణమై యుండుటవల్లనే ఇన్నిరాజ్యాలు నేడు ఏకముఖముగా ఈ సమారాధనలో చేర గల్గుచున్నవి. లోకములోని రాజ్యాల నన్నింటిని పీకుకొనితినేటటువంటి గద్దవలె, పెద్ద రాబందువలె హిట్లరు తన చేతులను చాచుచున్నాడు. అతని ప్రక్కనే మసులోనీకూడా గోతివద్ద నక్కవలె తిరుగుచున్నాడు. ప్రపంచమునంతను స్మశానభూమివలె చేయుచు, చచ్చిపడియున్న మృతకళేబరములవంటి రాజ్యాల ప్రజలను పీకుకొనితినుచున్నారు. ఈ ఫలాహారమును తాను కూడాచేయుటకు తూర్పు వైపునుంచి జపాను కాకి కూడా రెక్కలు ఎగురవేయుచు, చంకలు కొట్టుకొనుచు, ఇతరుల రాజ్యాలను అపహరించుటకు తయారైనది. ఈ కాక, గృధ్ర, జంబుకములు (కాకి, గద్ద, నక్కలు) ఏకమై తమ కడుపు నిండుటకొరకై ప్రపంచమంతయును రుద్రభూమి కావలెనని కోరుచున్నవి. ఇటువంటి అమంగళమును తొలగించుటకై మిత్ర రాజ్యాలన్నియు నేడొక సమష్టి ద్వేషభావముతో ఏకీభవించియున్నవి.

ఇటువంటి దివ్యమైన ప్రజాసంకల్ప బలము అక్షరాజ్యాలలో లేదు. హిట్లరు తమపాలిటి రక్షకుడనే నమ్మకము జర్మనుప్రజలలోనే క్రమేణ క్షీణించుచున్నది. అక్రమంగా జయించిన రాజ్యాలతో జర్మను ప్రజలు ఉబ్బి తబ్బిబ్బగుట లేదు. జయింపబడిన రాజ్యాలు పక్కలోని బల్లెములవలె వున్నవి. మానవకోటియంతయును తమ్ము ద్వేషించుచున్నదని గ్రహించిన జర్మనుగాని, ఇటాలియనుగాని, జపానీయుడుగాని మన పతాక సమారాధనదినమున శాంతచిత్తుడై సుఖంగా నిద్రపోగలడా?

# ఖార్కోవు యుద్ధములో
# జర్మను రష్యను లాభ నష్టములు.

ఇంగ్లాండులోని డెయిలీ ఎక్సుప్రెస్ పత్రిక యొక్క సైనిక వ్యవహార విలేజరి ఖార్కోవు యుద్ధ పర్యవసానమునుగూర్చి యీ క్రింది వివరములను వ్రాసెను :—

ఖార్కోవువద్ద రష్యను సేనలకు జర్మను సేనలకు జరిగిన యుద్ధమునందు జర్మనులకు ఎంత నష్టముకలిగినదో ఆ లెక్క వివరములను పరిశీలించినట్లయితే, అచట జర్మనులు సిద్ధపరచిన సైనికబలం మూడోవంతు తగ్గిపోయినదని లెక్క తేలుచున్నది. ఖార్కోవువద్ద యుద్ధమును నడిపించిన జర్మను సేనాధిపతియగు వాన్‌బాక్‌గారు 5 లక్షల సైన్యాన్ని, 1,500 టాంకులను, 6,000 ఫిరంగులను, 1,000 విమానములను యుద్ధరంగమునకు తీసికొనివచ్చెను. కాని, ఖార్కోవు యుద్ధానంతరము లెక్కచూడగా అక్కడ మూడు వారములు జరిగిన యుద్ధములో జర్మనులకు 90,000 మంది సైనికులు నష్టమైరి. అనగా సిద్ధపరచిన సైన్యంలో ఐదవవంతు నష్టమైనది. ఇదిగాక, 540 టాంకులు, 1,511 ఫిరంగులు, 200 విమానాలు జర్మనులకు నష్టమైనవి. టాంకులలో మూడోవంతు నష్టమయినవి. కనుక ఆయుధబల నష్టమునుబట్టి జర్మను సైనికబలము కూడా మూడోవంతు నష్టమైనదని చెప్పవచ్చును. టాంకులు ఎన్ని ఎక్కువగావుంటే సైన్యం అంత ఎక్కువగా ముందుకు పోగలదు.

రష్యను సేనలను నడిపించిన టిమోషెంకో సేనాని చాలా సమర్థుడు. ఈవిధంగా ఖార్కోవు యుద్ధంలో జర్మను సేన నష్టపడుటవల్ల, జర్మనులు కాకసను ప్రాంతములకు యింకొకమాసు వరకు చండెత్తిపోజాలరు. బహుశః 6 వారాలు లేదా 2 నెలలుకూడా పట్టును. ఈవిధంగా జర్మను సేనలు యీ వసంతసమరములో విజృంభించవలెనని ప్లానువేసికొని యుంచినప్పటికీ, అనుకొన్నప్రకారంగా వారికి నడక సాగకుండా టిమోషెంకో సేనాని సమర్థంగా నిరోధించాడు. తిరిగి యింకొకపర్యాయము జర్మనులు విజృంభించేలోపుగా ఖార్కోవువద్దనున్న రైలుమార్గములను, రస్తాలను కట్టుదిట్టం చేసికొనుచున్నాడు. ఇంకొక 2 మాసాలు యీవిధంగా రష్యనులకు వ్యవధి లభించుటవల్ల జర్మనులు యీ 1942 వ సంవత్సరంలోకూడా కాకసను ప్రాంతంలోనికి ప్రవేశించుటకు వీలులేకుండా తిరిగి మంచుకాలం వచ్చేవరకు జర్మనులను రష్యనులు నిరోధించగలరు.

ఇదివరలో పోలెండు యుద్ధం చేసినప్పుడు జర్మనులు విమానాలతోను, మోటారులతోను అతిశీఘ్రంగా ముందుకు చొచ్చుకొని, శరవేగ యుద్ధం చేసారు. కాని, యీ శరవేగ యుద్ధం యిక్కడ రష్యాలో సాగకుండా టిమోషింకో సేనాని అరికట్టగల్గెను. జర్మను సేనలు ఒకదాని వెనుక ఇంకొకటి నిలువబడి శ్రేణీపరంపరగా వచ్చి యుద్ధము చేయవలసివచ్చెను. ముందుకు చొచ్చుకొని దట్టమైన రష్యను సేనల శ్రేణులను భేదించుకొనిపోవుటకు సాధ్యము కాలేదు. అందువల్ల జర్మనుల శరవేగ యుద్ధ పద్ధతి రష్యాలో సాగకుండా చేయబడెను.

కాని యీ ఖార్కోవు యుద్ధం ఒక్కటే కాదు. ఇంకా చాలా యుద్ధాలు జరగాలి. జర్మను సేనలు కీవువద్దను, బ్రియాన్సుక్కువద్దను, స్మాలెన్సుక్కువద్దను సమృద్ధిగా చేర్చబడియున్నవి. ఎక్కడ జర్మను సేనలు ఎక్కువగా విజృంభించునో, అక్కడనే రష్యను సేనలను కేంద్రీకరించి తీవ్రయుద్ధం చేయవలెనని స్టాలిను సంకల్పించియున్నాడు. ఈవిధంగా ఎడతెగకుండా జర్మను సేనలను ముందుకు సాగనివ్వక అడ్డగిస్తూ ఉన్న యెడల జర్మనులకు చాలా కాలహరణం కాగలదు. రష్యాలో ఎండలు ఉండే కాలము 5 మాసాలు మాత్రమే. జర్మనులకు యీ సంవత్సరంకూడా యీ పుణ్యకాలం దాటిపోయేటట్లుగా ఉన్నది.

# హిట్లరుకు బలబద్ధకము.

ఆరంభ శూరత్వంచూచి అనేకులు మోసపోతారు. కొత్త చాకలి వుతికిన బట్టలు చాలా త్వరగా తీసికొనివస్తాడు. ఈ ఆదివారంనాడు చలువచేయునిమిత్తమై వేసిన బట్టలను వచ్చే ఆదివారంనాటికి సరిగ్గా లెక్క తప్పకుండా వారం రోజులలో తీసికొనివస్తాడు. బట్టలుకూడా తెల్లగా కొంగ రెక్కలవలె చలువచేసితెస్తాడు. కాని, నాలుగైదు రేవులు వుతికినతర్వాత వేసిన బట్టలు చింపుకొనిరావడం,—లేదా, ఒకరి బట్టలను ఇంకొకరికి మార్చడం,—లేదా, ఇంట్లో యిబ్బందిగా వున్నదనిచెప్పి పదిహేనురోజులు గడచినా బట్టలు తీసికొనిరాకపోవడం,—లేదా, ఉతుకుటకు వేసిన మురికిబట్టలను మరింత మురికిచేసి తీసికొని రావడం సాగిస్తాడు. మొదట్లోవున్న చురుకుదనం, కొంతకాలం గడిచేసరికి పోతుంది. కత్తికి మొదట్లో వున్న వాడి కొన్నాళ్లయినతర్వాత పోతుంది. కొత్త బట్టకు వున్న రంగుల జిగి, బట్ట వెలిసినతర్వాత యెందుకు వుంటుంది? మన హిట్లరు బ్రహ్మచారికికూడా మొదట్లో వున్న జోరు క్రమేణ తగ్గింది. తాను యుద్ధం చెయ్యదానికి సంకల్పిస్తే, ఆయుద్ధం నిమిషాలమీద గంటల మీద పూర్తిఅవుతుంది అనేవాడు. గడియారం దగ్గరపెట్టుకొని కార్యం పూర్తిచేస్తాను అనేవాడు. ఒక్కొక్కరాజ్యం జయించడానికి, ఒక్కొక్క వారం, లేదా ఒక్కొక్క నెల, లేదా, కొలది వారాలు, కొలది మాసాలుమాత్రమే పట్టవలెను గాని, సంవత్సరములకొలదీ ఒక్కటేరాజ్యంతో యుద్ధంచెయ్యడం తనపద్ధతికాదని ప్రజ్ఞలు పలికి పని ప్రారంభించాడు. ఫ్రాన్సును, హాలెండును, పోలెండును, గ్రీసును, యుగోస్లోవియాను, యీ విధంగా శరవేగప్రమాణంలోనే జయించాడు. కాని, రష్యావంటి పెద్ద రాజ్యంతో యుద్ధం సాగించేసరికి, శరవేగ సమరసరళి యక్కడ అక్కరకురాలేదు. క్రిందటి సంవత్సరం జూను 22 వ తేదిని రష్యాతో హిట్లరు యుద్ధం ప్రారంభించాడు. ఇంకొక పదిరోజులకు సంవత్సరం పూర్తిఅవుతుంది. గత జూను మాసంలో రష్యాతో యుద్ధం ప్రారంభించినప్పుడు 14 వారాలలో అనగా మూడు నాలుగు మాసాలలో రష్యాను జయించగలనని అంచనా లెక్కవేసికొని, ఆ అహంభావంతోనే యుద్ధంలోకి దిగాడు. 1941 వ సం॥ నవంబరుమాసంనాటికే, అనగా మంచు కురిసే రోజులు వచ్చేసరికే రష్యాతో యుద్ధం పూర్తికాగలదనుకున్నాడు. కాని, యిదివరకు చిన్నచిన్న రాజ్యాలను జీర్ణం చేసుకొన్నట్లుగా రష్యాను జీర్ణంచేసుకోలేకుండా వున్నాడు. శరవేగ సమరపద్ధతి సాగడంలేదు. అందువల్ల రష్యాలో నిదానంగా యుద్ధంచేయవలసిన స్థితి వచ్చింది. హిట్లరుయొక్క యుద్ధోద్ధతి యిచట బద్ధకించింది. రష్యనుసేనలను భేదించుకొని శీఘ్రంగా ముందుకుపోలేకుండావున్నాడు. రష్యను చలిమూలంగా తన సేనలు యిదివరలో కొన్ని మాసాలవరకు ముందుకు పోలేక స్తంభించినవన్నాడు. అటువంటి చలి తా నిదివర కెన్నడూ యెరుగనని అన్నాడు. ఇప్పుడు చలిపోయి, ఎండవచ్చిందిగదా? ఇప్పుడుకూడా శరవేగంగా సమరం సాగుటలేదేమి? బహుశ రష్యాదేశపు నీళ్లు జర్మనుసేనలకు సరిపడుటలేదేమో? సేనలు అందువల్లనే యుద్ధం చెయ్యలేక బద్ధకించినవేమో! జర్మనుసేనలు బద్ధకించినమాట నిజమే. హిట్లరుయొక్క సేనాబలము బద్ధకించుటవల్లనే సమరం శరవేగంగా సాగడంలేదు. మీసాలు దువ్వడమేగాని, మాసాలు గడచినా పటాలాలు ముందుకు కదలడంలేదు. మొన్న జరిగిన ఖార్కోవు యుద్ధంలో జర్మనులు ముందుకు కదలలేకపోయినవి. హిట్లరుకు యుద్ధశక్తి తగ్గి, బలబద్ధకంచేసినదనే నిర్ణయించవలసియున్నది. ఈ బలబద్ధకం వ్యాధి అంత్యదశకే ప్రవేశించింది. రష్యాలో యుద్ధం ఎంత నిదానంగా జరిగి, ఎంత కాలహరణమవుతుందో, అంత కట్టుదిట్టంగా ఇంగ్లాండు అమెరికాలు శత్రుమారణప్రయోగాలు యీలోగా చేయుచుండగలవు.

# జర్మనీమీద జాయింటు తంత్రం.



రష్యాలోని రష్యను విమానదళముతో కలసి అచటి బ్రిటిషు విమానదళముకూడా ఉభయులకు శత్రువులగు జర్మనులపై విమానదాడులను సాగించుచున్నవి. అచటి బ్రిటిషు విమానదళమునకు అధిపతియైన హెచ్. యన్. జి. రామ్సుబాటంఇషర్వుడ్ గారు యీపటములో కంటికి దూరదర్శినీ అద్దములు పెట్టుకొని చూచుచున్నారు. వారిప్రక్కను రష్యను విమానదళాధికారులు నిలువబడి యున్నారు. రష్యను బ్రిటిషు విమానములు దూరముగానున్న ఒక మకామునుండి శత్రువుమీదకు ఎగిరిపోవుచుండగా దూరదర్శినీ అద్దములతో బ్రిటిషు విమానదళ సేనాని చూచుచున్నాడు.

---

# సింహాళంలో విమానబలం.

సింహాళంలో మన బ్రిటిష్ విమానబలము ఇటీవల ఎంత ఎక్కువగా వృద్ధిచేయబడెనో వివరించుచు అచటి విమానదళాధికారి యొక రిట్లు చెప్పిరి :—

మలయాలో అనగా సింగపూరు ప్రాంతంలో యుద్ధం జరుగుచుండినప్పటినుండియు సింహళములోని బ్రిటిష్ విమానదళము వృద్ధిచేయబడుచున్నది. మొట్టమొదట సింహళము లంకలో "కటాలినా" అనబడు కొలది అమెరికను జలవిమానములు మాత్రమే యుండెను. శత్రునావ లేవైన సింహళప్రాంతములలో తిరుగుచున్నవేమో కనిపెట్టి చూచుచుండుటకై యీ కటాలినా విమానాలు ఉపయోగపడుచుండెను. సింగపూరు శత్రువశమైన అనంతరమే ఇచట

కట్టుదిట్టమైన విమానబలము వృద్ధిచేయబడెను. క్రొత్త విమానాలు చేర్చబడెను. క్రొత్త విమానాశ్రయములు నిర్మింపబడెను. గత ఏప్రిలు మాసారంభములో యీస్టరు సెలవులలో ఇచటి హరికేను విమానాలు చాల అద్భుతంగా పనిచేసి శత్రువిమానాలను ఎదిరించి తరిమివేయగల్గెను. సింహళములోని మన క్రొత్త విమానాశ్రయము లెక్కడ కలవో శత్రువు తెలిసికొనలేకపోయి నాడు. మన విమానాలకంటె జపాను విమానాలు చాలా హీనమైనవి. జపానువారు అనేక విషయములలో చాలా కక్కుర్తిపనులు చేస్తూ వుంటారు. తమ విమానాలు ఎక్కువ బరువుగా వుండకూడదనే అభిప్రాయంతో తమ విమానములలో చేయవలసిన బందోబస్తులను పెక్కింటిని చేయకుండానే ఆ విమానములను నిర్మిస్తున్నారు. ఇటువంటి తక్కువరకపు యుద్ధసాధనములతో ఎక్కువ కష్టనష్టముల కోర్చి ఎక్కువ పట్టుదలతో జపానువారు పోరాడవలసినవా రగుచున్నారు.

ఇప్పుడు సింహళములో వృద్ధిచేయబడిన బ్రిటిష్ విమానదళము చుట్టుప్రక్క ప్రాంతాల లోనికి రాగల జపాను నావలపైకి దాడి వెడలి వాటిని ధ్వంసంచేసి రాగలవు. కొలదికాలంలోనే సింహళం లంక \ అఖిల ప్రపంచ విమాన రహదారీ మార్గములకు ముఖ్యమైన కూడలిగా ఏర్పడగలదు.

---

# చైనాలోని సూచోనగర విధ్వంసము.

చైనాలోని సూచోనగరం చాలా అందమైనది. 1937 వ సం॥ నవంబరు మాసంలో ఆ నగరమందు జరిగిన సంగతులను ప్రత్యక్షంగా చూచినవా రొక రిట్లు వ్రాయుచున్నారు —

సూచోనగరంలోని ప్రజలు, వృద్ధులు, పిల్లలు, స్త్రీలు 3½ లక్షల జనం ఉన్నారు. ఈ పట్టణం చాలా రమ్యమైనది. కాని, ఆ సంవత్సరం నవంబరు రెండవ వారంలో జపాను విమానములు ఆ నగరంమీదకు వచ్చి చాలా పెద్దపెద్ద ప్రేలుడు బాంబులను వేసెను. ఆ దెబ్బలకు మనుష్య శరీరములు ముక్కలుముక్కలుగా చెల్లాచెదరై ఎగిరిపోయినవి. ఇండ్లు, మేడలు, మిద్దెలు తునాతునకలుగా బ్రద్దలైపోయినవి. పైనుంచి జపాను విమానములు యీరీతిగా ప్రళయ వర్షం కురిపిస్తూ ఉండె. భయకంపితులైన జనులు నేలకందకములలోనికి వెళ్లి తలదాచుకొని అరచేతులలో ప్రాణాలు బిగబట్టుకొని ఉన్నారు. అప్పుడు నేనున్నూ మరికొందరున్నూ కందకములలోనే దాగివున్నాము. తిరిగి ఏమైనా సరే, భగవంతునిమీద భారం వేసి పనిపాటులలోకి పోదామా అని మాలో మేము విచారించుకొన్నాము. నవంబరు 9 వ తేదీని జపాను విమానాలు వచ్చి కొన్ని అచ్చుకాగితములను క్రింద పడవేసెను. మూడు రోజులైన పిమ్మట, సుందరమైన ఆ నగర మంతటిమీదను తీవ్రంగా బాంబులు వేయబడునని ఆ కాగితములలో హెచ్చరిక చేయబడెను. అంతట ఆ నగరంలోని ప్రజలందరూ వేలకొలది లక్షలకొలది స్త్రీలు, పురుషులు, పిల్లలు తమ సామానులను వెంట తీసికొని నగరం విడిచి వెళ్లిపోయినారు. ఆవిధంగా ఆ రమ్యమైన నగరమును వారు విడిచిపోవు చుండగా నేను చూచినప్పుడు నాకు కలిగిన దుఃఖమునకు మేరలేదు. ఆరీతిగా ఖాళీచేయబడిన పట్టణమును జపానువారు ఆక్రమించారు.

---

# చైనాకు యుద్ధ సామగ్రి సప్లయిలు.

ఇండియానుంచి 2½ కోట్ల రూపాయిల కిమ్మతుగల సామగ్రులను సప్లయి చేయవలసినదిగా, చైనాలోని పీకిను సిండికేటు లిమిటెడ్ అను కంపెనీవారి ద్వారా చైనా ప్రభుత్వంవారు ఇండియాలో చాలా సరకులకు బేరం యిచ్చియున్నారు. కోరాతానులు, కాన్వాసు (నారతోనేసిన పట్టా గుడ్డలు) నూలు ఇవి సుమారు 2½ కోట్ల రూపాయిలు కిమ్మతుగలవి సప్లయి చేయవలెనని ఆర్డరు ఇచ్చారు. ఇదిగాక పెట్రోలున్నూ. విమానాలకు కావలసిన స్పిరిటున్నూ చాలా పెద్ద మొత్తమునకే సప్లయి చేయవలసినదిగా ఆర్డరు యిచ్చియున్నారు. ఇదిగాక యంత్రపరికరములు, పనిముట్లు, రాగి

తీగె, ఇత్తడి రేకులు, అల్యూమినియం, అభ్రకం, గ్రాఫైటు, మానిల్లా త్రాడు, రంగులు, వార్నీషులు, రసాయనద్రవ్యములు, ఔషధములు వారు కోరిన సామగ్రుల జాబితాలలో కలవు.

ఈ సరకులలో విశేష భాగము అరువుగానే సప్లయిచేయుటకు నిర్ణయింపబడెను. లండనులో నున్న ఎగుమతి సరకుల అరువు లెక్కల హోమీ డిపార్టుమెంటువారి తరఫున ఇండియాలోని బ్రిటిష్ ప్రాచ్య రాజ్యమండలి చెయిర్మను అగు సర్ ఆర్చిబాల్డు కార్టరుగారు యీ సరకుల రవాణా తాలూకు అరువు బేరమును ఒప్పుకొనియున్నారు. కొన్ని సరకులు నగదుకే సప్లయి చేయబడు చున్నవి. ఇండియా గవర్నమెంటువారి సప్లయి డిపార్టుమెంటు ద్వారా, యీ సరకులకు ఆర్డర్లు యివ్వబడుచున్నవి. ఈ సప్లయి డిపార్టుమెంటు వారే యీ దేశంలోని ఫ్యాక్టరీల ఆసాములతో మాట్లాడి, వారికి ఏమైనా ముందుగా అడ్వాన్సు పెట్టుబళ్లుకూడా అవసరమైతే యిచ్చి సరకు తయారుచేయిస్తున్నారు. చైనాకు యేయే సర కులు జరూరుగా మున్ముందు రవాణా కావలెనో, అట్టివానిని ముందుగా ఎంత సరకు దొరికితే అంతమేరకు ఇండియా గవర్నమెంటు పంపించు చున్నారు. సరకు తయారుచేయుటకు ఎంత వరకు సాధ్యపడునో దానిని బట్టి శక్తివంచన లేకుండా చైనాకు సరకు సప్లయి చేయబడుచునే యున్నది.

---

# విమానదాడి శరణ్యా వినియోగసాధకము.

విమానదాడి జరిగినప్పుడు ప్రజలు వెంటనే కందకములలోనికి భద్రమైన ప్రదేశాలకు వెళ్లి ఏవిధంగా దాగుకొనవలెనో ఇటీవల పరీక్షార్థము సాధకముచేయబడెను. ఇండ్లలో ఉండేవారు ఎక్కడ నిల్చుంటే వారికి భద్రకరమో క్షేమ కరమో వార్డెన్లు వెళ్లి ఇండ్లలోని వారికి సలహాలు యివ్వవలెను. ఇటీవల జరిగినటువంటి పరీక్షార్థ మైన సాధకములు చాలా అవసరము. అట్టి సాధకములవల్ల పోలీసువారును, విమానదాడి రక్షక దళమువారును కలిసి మెలసి ఏ రీతిగా పనిచేయవచ్చునో బోధపడును. ఈ సాధకము వల్ల గ్రహింపబడిన అనుభవ విశేషములు సివిలు డిఫెన్సు డిపార్టుమెంటువారిచే రాష్ట్రీయ ప్రభుత్వములకు, చీఫ్ కమిషనర్లకు యాదాస్తుల ద్వారా తెలియజేయబడుచుండును.

ఎక్కడ ఏ సొత్తు ఎంత నష్టమైనదో అచట కు హాజరైన ఏ.ఆర్.పి. ఆఫీసర్లు ఎవరెవరో రిపోర్టుచేయవలసిన పని ఏ ఆర్.పి. వార్డెనుదై యున్నది. అన్నిటికన్న ముఖ్యమైన పని తన వార్డులోని జనానికి సదుపదేశములనిచ్చుచుండ వలెను. ఏ ఆర్.పి. ఆఫీసర్ల సాధకములుగాక, సామాన్య జనమునకు ప్రత్యేక సాధకములు ఏర్పాటుచేయవలెను. విమానదాడి సమయంలో జనులు ఏ విధంగా శరణ్యములకు పోవలెనో చూపి నేర్పవలెను. ఈ సాధకములు దీర్ఘ కాలము జరుపకూడదు. 3 గంటలకాలం లేదా 4 గంటలకాలం జనులను పరీక్షార్థంగా విమాన దాడి శరణ్యములలో ఉంచకూడదు. 'ఒక్క రోజులోనే అనేక పర్యాయములుగానైనను అట్టి సాధకములను జనులచేత చేయించకూడదు. 15 నిమిషముల కాలము మాత్రమే యీ సాధకము జరుగవలెను.

విమానదాడి నిజంగా జరిగినప్పుడు వినోదం గా చూచేటటువంటి జనం ఉండకూడదు. ఏమైనా అగ్నిప్రమాదాలు సంభవిస్తే ఏ ఆర్.పి. ఆఫీసర్లు రాకపూర్వమే, గాయపడినవారికి, నష్టపడినవారికి ఇరుగుపొరుగు జనులు వెంటనే సహాయములు చేయవలసియున్నది. "ఆ పనులు అవసరమైన వాళ్లే చేస్తారు. ఆ పని మనకేమి పట్టినది" అనే తత్వం జనులలో ఉండకూడదు. సాధన పరికరములు సమృద్ధిగా ఏ.ఆర్.పి. ఆఫీసరులకు కొన్ని ప్రాంతాలలో సప్లయిచేయబడకపోయి నను, ముందుగా తగిన శిక్షను పూర్తిగా పొంది యుండవలెను. సామగ్రులు పరికరములు సప్లయి చేయబడిన వెంటనే వాటిని ఉపయోగపరచుటకు సిద్ధంగా ఉండవలెను. ఏ ప్రాంతములకు మున్ముందుగా ముఖ్యంగా సాధన పరికరములు పంపబడవలెనో ఆ ప్రాంతములకే ముందుగా అవి పంపబడుచున్నవి.

రహదారిలమీద బండ్లను ఆపివేయుటలో లోపము జరుగుచున్నది. నాలుగు రోడ్లు కలిసే చోట్ల వార్డెన్లుగాని పోలీసులుగాని నిలువబడి

బండ్లను ఆపివేయుచున్నారు. అందువల్ల ఒక్కొక్కచోట బండ్లన్నియు గుంపులుగా చేరుచున్నవి. బాంబులు పడినప్పుడు ఆవిధంగా అవి గుంపులుగా గుమికూడియుండడం చాలా ప్రమాదకరం. ఆ బండ్లుగాని, రోడ్లమీద నడిచే జనులుగాని, రోడ్ల ప్రక్కకు తొలగిపొమ్మని చెప్పేవరకు తొలగుటలేదు. పక్కకు తొలగిపోతే చాలదు. శరణ్యములలోనికి వెళ్లి జనులు దాగుకొనవలెను.

ఇండియాలో విమానదాడులు జరిగితే నీటి సరఫరా తక్కువగుటవల్ల అగ్నిప్రమాద బాధ ఎక్కువగానుండగలదు. కనుక, చెరువులను జలాశ్రయములను పెక్కింటిని నీటియిబ్బందిగల చోట్ల నిర్మించవలెను. ఏ.ఆర్.పి. వార్డెనులలో వేర్వేరు వార్డులలోనివారు తగినంత పరస్పర సహకారముతో పనిచేయుటలేదు. పై చెప్పిన శిక్షణ విధానలోపములను తొలగించుటకై ట్రెయినింగు ఆఫీసర్లను కొందరిని వేర్వేరు పట్టణములకు రాష్ట్రీయ ప్రభుత్వములవారు పంపి అచట ట్రెయినింగు ఆఫీసరులకు సలహాల నిప్పించవలెను.

---

# మద్రాసు పటాలములలో జనహాని.

వేర్వేరు తేదీలయందు యీ క్రింద చెప్పబడిన జనహాని మద్రాసు పటాలములలో సంభవించెనని ప్రకటించుటకు చింతిల్లుచున్నాము :—

## మద్రాసు సాపర్లు, మైనర్లు—పటాలము

| నెంబరు. | హోదా. | పేరు. |
|---|---|---|
| | **మరణించినవారు.** | |
| ఇండియన్ ఇంజనీరు దళములో— | | |
| 1557 | భోజనశాలలోని వడ్డనవాడు | ఆంథోనీ. |
| 48660 | లాన్సు నాయక్. | పెరుమాళ్ నాయుడు. |
| 49152 | లాన్సు నాయక్. | సి ఆర్. స్వామి. |
| ఇండియను సిగ్నలు దళములో— | | |
| 15255 | సిగ్నలరు ... | మునిరత్నం. |
| ఏ-2556 | సిగ్నలరు ... | మునిసామి. |
| ఏ-7823 | సిగ్నలరు ... | రాధాకృష్ణన్. |
| ఏ-5641 | సిగ్నలరు ... | సూసా మాణిక్యం |
| 15975 | లాన్సు నాయక్. | తంగప్పన్ పిళ్లై. |
| | **కనిపించనివారు.** | |
| 63577 | సాపరు ... | చొక్కలింగం. |
| 63217 | సాపరు .. | జ్ఞానస్వామి. |
| 63697 | సాపరు ... | ఆరోగ్యం పిళ్లై. |
| 63720 | సాపరు ... | కృష్ణస్వామి నాయుడు. |
| 60170 | సాపరు ... | పెదచెట్టి. |
| 63136 | సాపరు ... | మారియప్పన్. |
| 64116 | సాపరు ... | నారాయణస్వామి. |
| 63559 | సాపరు ... | పరశురాం. |

| నెంబరు. | హోదా. | పేరు. |
|---|---|---|
| సిగ్నలరు దళము— | | |
| 893946 | పి లాన్సు నాయక్. | పీతాంబరం పిళ్లై |
| 899536 | సిపాయి ... | గోపాలకృష్ణన్, ఆర్. |
| 896017 | సిపాయి .. | లక్ష్మణన్. |
| 900252 | సిపాయి .. | మునిస్వామి, ఆర్. |
| 894114 | పి. వి లాన్సు నాయక్. | మునిస్వామి |
| 900288 | సిపాయి ... | రాజమాణిక్యం. |
| 894115 | సిపాయి .. | సుబ్రమణ్య పిళ్లై, సి. |
| 803977 | యా. పి లాన్సు నాయక్. | వడివేలు. |
| 896156 | సిపాయి .. | వెంకటస్వామి |
| 899860 | సిపాయి . | వెంకటేశన్, పి. |
| | **గాయపడినవారు.** | |
| ఇండియను ఆక్జిలియరీ పయొనీరు పటాలములో— | | |
| 48661 | హవల్దారు ... | నారాయణ నాయరు. |
| యన్ పి ఓ | | |
| 1544 | లాన్సు నాయక్. | కరీముల్లా. |
| 1133 | సిపాయి ... | సుందరమహాలింగం, కే. |
| సిగ్నలరుల దళము— | | |
| 896300 | సిపాయి ... | ఇరుదయం. |
| ఐ ఏ ఒ సి | | |
| ఓ/30717 | సిపాయి ... | ఫ్రాన్సిసు ఫెర్నాండెజ్. |

MADRAS. PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.